# ఖడ్గతిక్కన



సీ. తనబాహుయుగళంబు మనుమసిద్ధీశ్వరు
గవనివాఁకిటికి నర్గళలుగాఁగ
దనవాఁడియడిదంబు మనుమసిద్ధిమహీంద్రు
రాజ్యలక్ష్మికి నంగరక్షగాఁగ
దనకంటికెంజాయ మనుమసిద్ధినృపాలు
గాత్రంబునకుఁ గంచుకంబుగాఁగ
దనవజ్రకాయంబు మనుమసిద్ధిప్రభు
పట్టంపుటేన్గుకంబంబుగాఁగ

గీ. తన ముఖబ్రహ్మతేజమున్ మనుమసిద్ధి
పరబలక్షాత్రతేజంబు శరణుఁగోరఁ
దాను బెట్టనికోట భూజాని కనఁగ
ఖడ్గతిక్కనసేనాని గ్రాలుచుండె.

చ. పగఱశిరశ్చయం బెగుర
బంతులకై వడి మింట నూఁచకోఁ
తగఁ దెగవైచుచున్ విఱుగఁ
దన్నుచు మార్కొను తేరిమొత్తముల్
రగులఁగఁజేయుచుం బరుల
రాజ్యములం దనచూడ్కినిప్పులన్
లగువున నా ప్రవీరుఁడు
కలంకులఁ జూపెను వీరకేళులన్.

గీ. పగఱ గుండెలుదీసిన బంటతండు
శాత్రవులకోటలోఁ బాఁతి జయపతాక
వారి రత్నకిరీటముల్ బలిమిఁదెచ్చి
తేని పుత్రుల శిరసులం బ్రీతి నునుచు. ౩

కం. అనఘుం డాతఁడు ద్రోణికి
ననుజుం, డపరావతార మా భార్గవునం
దనునకు నని లోకంబులు
గొనియాడఁగఁ దాల్చెఁ గీర్తికోటీరంబున్. ౪

చ. తొలఁగి ప్రపంచకంబునకు
దూరముగా నయి పేర్చు ద్వంద్వముల్
గెలిచి ముముక్షువృత్తిని సు
ఖింపఁ దలంచు ప్రశాంతులైన వి
ప్రులు నడుమున్ బిగింప రణ
భూమిఁగలంపరె తోఁకచుక్కలై!
యిలపయి సాదురేఁగఁ దల
యేఁగి పడుం బొలమం దఁటంద్రుగా!

గీ. బుధవరుండగు తిక్కన బుద్ధిబలముఁ
బ్రబలుఁడగు ఖడ్గతిక్కన బాహుబలముఁ
దివిరి ధర్మార్థములను సాధింపఁ దనకు
మనుమసిద్ధీశ్వరుండు పాలన మొనర్చె. ౬

కం. ఒకనాఁడు మంత్రిముఖ్యులుఁ,
బ్రకృతులు, సామంతవరులుఁ, బరివేష్టింపన్
నికటాసనములఁ దత్సభ
కొక భటుఁ డా మనుమసిద్ధి యొద్దికి వచ్చెన్. ౭

ఆ. వె. వచ్చి వంగివంగి వందనం బొనరించి
వలువమడతలందుఁ బదిలపఱచి
తెచ్చియున్న కమ్మఁదీసి యం దిచ్చిన
సచివవరుఁడు దానిఁ జదివె నిట్లు. ౮

గీ. "శ్రీమహామండలేశ్వర శ్రీకుఁడైన
సార్వభౌముండు యాదవ చక్రవర్తి
తనదు సామంతరాజైన మనుమసిద్ధి
కానతిచ్చుచు నున్న దెయ్యది ? యనంగ." ౯

గీ. అనుచుఁ జదువుడు ఱేఁ "డాఁగుమాఁగు మచట
మనము సామంతులమె యాదవునకుఁ ? దాను
సార్వభౌముండె ! నన్ను నాజ్ఞాపనంబు
సేయునే యాతఁ ? డెట్టి విచిత్రవార్త ? ౧౦

గీ. కూన గండైన కరణి నీ కూళ నేఁడు
ఎంత గండరగండఁడై యేపుఁజూపె ?
వెలుఁగునఁట ! దివ్వె నిర్వాణ వేళయందుఁ;
గలుగునఁట ! తెల్వి యవసానకాలమందు; ౧౧

కం. ధనియాల జాతి వీనిది;
మనంబునం దెంచె వీఁడు మన సహానత్వం
బును బిఱికితన మటంచును;
వినాశకాలమున బుద్ధి విపరీత మగుఁగా. ౧౨

గీ. చదువు మాపయిన్ నావుడు సచివ వరుఁడు
చదువఁగాఁ బూనె నిట్లు "నీ జాబుఁ గంటి
మీరు పుల్లరి నెగఁబెట్టినారుగానఁ
జర్యఁ గైకొందు మను వ్రాఁతఁ జదువ వింటి. ౧౩

కం. మాకీయ వలయు కప్పం
బీకుంటివి నీవ నాలుగేఁడుల నుండిన్
మూకత నుంటిమి యోపిక;
నీ క్రియ వ్రాసితివి విప్రతీపముగా దే ? ౧౪

కం. కలదు ప్రభుత్వము సామం
తులపై రాజులకు సర్వతోముఖముగ; మీ
పొలమందు మాదుపసరం
బుల మేఁపుట ధర్మ; మేల పుల్లరి నీయన్ ? ౧౫

కం. తెలియక వ్రాసిన యీ వ్రాఁ
తలఁగూర్చి క్షమార్పణంబుఁ దగిన విధమునం
దెలుపమిఁ, బంపమి నీ వీ
వలసిన యరిఁ బట్టవలసి వచ్చును గత్తిన్. ౧౬

కం. హిత ముపదేశింతుము విను
బ్రతుకుము మా గొడుగు నీడఁ బదికాలా; ల
ద్భుతమగు మా తేజోఽగ్నికిఁ
బతంగత వహింపఁబోక ప్రజలున్ నీవున్. ౧౭

ఆ. వె. కడుపుఁ గదలకుండఁ గుడిచికూర్చుండక
కాలుద్రవ్వు దీవె కయ్యమునకు
మానవంతులైన మండలేశ్వరులము
ఇంతకన్నఁ దెలుప నేమి గలదు!" ౧౮

కం. అని చదువఁగఁ గవి తిక్కన,
విని భూపతి మనుమసిద్ధి "వీనికి సంధిం
చిన యట్లున్నది; గరళం
బునఁగా కెల్లితని రోగము నివార్య మగున్? ౧౯

చ. కరములుఁ గాళ్ళువట్టుకొని
కాదొకొ! కాటమ రాజు వేఁడె "దు
ర్మరణముఁ బొందు గోగణము
మా "యెఱగడ్డ"ను మేఁతలేమి; నీ
కఱవున నాశ్రయంబొసఁగి
కావుము గోవధనుండి యిత్తుఁబు
ల్లరి" నని నేఁడొనర్చు నవ
లాపము; నాల్కలు రెండు వీనికిన్ ౨౦

శా. దేవబ్రాహ్మణగోగణంబులు ధరి
త్రిం దుల్యపూతంబు; లా
దేవబ్రాహ్మణగోతతిం బ్రతిఫలా
ర్థిత్వంబుతో మేము సం
సేవింపంగను బోము; పుల్ల రిడినం
జేకొన్నఁ గోట్లబ్బునే?
యీవీటిండికి బుద్ధిసెప్పవలెనుం
డీ! నోరుమూయించుచుక్. ౧౦

క. అని విఱిచి బొమలు వలుకఁగ
జననాథునిఁ జుట్టియున్న సామంతనృపుల్
మొనగాండ్రు నిట్లు వలికిరి
కనుఁగవ గురియంగ నగ్నికణము లుఱుముచుక్. ౧౧

సీ. "ఆలకించెనో? లేదో? యల్ల "రక్కసగంగఁ"
డనినుండి కాలుదూసిన విధంబు;
వినియుండెనో? లేదో? ఘనుఁడు "కర్ణాటుండు"
మొనమొన్న శరణుఁగోరిన తెఱంగుఁ;
దెలియునో? తెలియదో? యల "విజయాధిపుం"
డస్త్రసన్న్యాసి యైనట్టి వార్త;
నెఱుఁగునో? యెఱుఁగఁడో? సరదారు "సారంగుఁ"
డశ్వంబుఁ గోల్పోయినట్టి కబురు;

గీ. వినియు నెఱిఁగియు నెవ్వాని విక్రమంబు
సాయముగ నమ్మి యిట్లాడ సాహసించె?
నిలఁ బ్రిభంజను నెదిరింప నెదుగు నెట్టి
భూరుహము నేలపైఁ గూలిపోవకుండు? ౧౩

కం. మన కీవలసిన కప్పముఁ
దన కీవలె మనమె యనుచుఁ దలక్రిందులు సే
సెను; దానను దలక్రిం దగుఁ
దనదు నదృష్టం బఁటం చతం డెఱుఁగఁ డెదద్. ౧౪

కం. తన మండలేశ్వరత్వము
తన తేజస్సార్వభౌమతలు, మన సామం
తనృపాలత్వముఁ దేల్చును
రణాంగణమె రేఁపు వేగిరంపడ నేలా? ౧౫

కం. జనుఁ డెంత యున్నతిం గొను
వినిపాతం బొందు నంత వేళాంతర మం
దనియును, బొంగిన యది పో
వును బ్రొయిపాలై యఁటంచు బుధు లందు్రగదా! ౧౬

కం. నోరా! కల్లల పుట్టయుఁ
బేరు హరిశ్చంద్రుఁడన్న విధమున వీఁడున్
బేరి కుదాత్తుండును వ్యవ
హారంబుల నుద్ధతుండునై వర్తిల్లున్. ౧౭

మ. ఇదె! యా యాదవసైన్యసాగరగణం
బిట్టింకు లింకించు ని
య్యాదన్ వేగురిపెట్టుగా నిలిచి మా
యం దొక్కండొక్కండె; మా
యుదుటుంగాంచఁ ద్రిలోకవీరతతికి
న్నుడ్డాడవే గుండియల్?
యదువంశీయున కీదినంబున కె చె
ల్లన్ వచ్చె వేయేఁడులున్ ౨౮

గీ. మిత్తి కుత్తుకయందు నువ్వెత్తువాలి
యుత్తరింప మా కత్తులు దత్తఱించు;
నడలఁజేయంగలాము సహస్రబాహు
లన ద్విబాహులమయ్యు యుద్ధాంగణమున, ౨౯

కం. రణభేరిని మ్రోగింతుము
జననాథా! యానతిమ్ము! సరగ" ననవుడున్
విని యాతఁడు విధిలేకయ
యనుమతి నిడి కొలువు విడిచి యరిగె నిరవుగన్. ౩౦

కం. తన దగు వాగ్దానము చో
ప్పునఁ గాటమభూపుఁ డిడక పుల్లరిఁ గాల్ద్రొ
వ్వెను; ఱేండ్ల బుద్ధి గర్వం
బునఁ గనక యధర్మవిషయములపై కుఱుకున్. ౩౧

గీ. సమరసాగరమందు నిశ్శంకముగను
శత్రుమత్స్యంబులను మ్రింగఁ జాలునట్టి
భటతిమింగిల బృందంబు వచ్చిచేరె
సిద్ధిరాజాజ్ఞ మేరకు యుద్ధమునకు. 32

గీ. విజయలక్ష్మినిఁ బెండ్లాడు విప్రవీరు
తోడి పెండిలికొడుకులు వేఁడినెత్రు
కదలఁబాఱఁ దాలిచి వీర కంకణముల
వీరతాయెత్తులం గట్టి వెడలి రనికి. 33

సీ. యమదండములఁబోని హస్తదండముల భీ
తినిఁ గొల్పుజగజెట్టి "తిప్పరాజు"
వ్రణకిణాంకం బైన వక్షశ్శిలావేదిఁ
గత్తులనూఱు "శ్రీకంఠరాజు"
భుజవిక్రమము పైకిఁ బొంగిన చందాన
నిక్కుమూఁపుల "పెద్దచొక్కరాజు"
బడుగుమేనికి జిల్గువలువయే కవచంబు
గాఁదాల్చు "గయికొండ గంగరాజు"
గీ. తనదు డాచేతినిం గేడెమునుగఁ జేసి
యాలములయందు మార్కొను "అచ్చిరాజు"
వాఁడిగోరుల నరసింహు పగిదిఁజేల్చు
"బసవరాజు"ను వచ్చిరి బవరమునకు. 34

శా. రంకెల్ వేయుచు గిబ్బపోఁతులకు సా
భ్రాత్రంబు సూచించుచున్,
ఘీంకారంబు లొనర్చుచుం గరితతి
స్నేహానుబంధంబు ని
శ్శంకంజూపుచుఁ, బోఁతుసింగములకున్
జ్ఞాతిత్వముం దెల్పుచున్
హుంకారించుచు, యోధపుంగవుల
శ్రేణుల్ వచ్చి నిల్చెన్ వడిన్. ౩౫

కం. గిరులకు హిమాచలమువలెఁ
గరులకు నైరావతంబు కరణి రణధురం
ధరుఁడైన ఖడ్గతిక్కన
ధరామరేంద్రుండు నిలిచె దళవాయిగనై. ౩౬

గీ. రక్తపుం జందియంబులు గ్రాల నతఁడు
రక్తగంధంబు మైఁబూసి, రక్తతిలక
మాస్యమునఁ బెట్టి, రక్తమాల్యములఁ దాల్చి,
సమరలక్ష్మీశ్వరుం డన్న సరణి మెఱసె. ౩౭

ఆ. వె. మనుమసిద్ధిగొన్న రణదీక్ష విని చేసె
యాదవుఁడు ప్రతిప్రయత్నములను
ద్రవ్యకాంక్షతోడ రాజ్యలోభముతోడ
వచ్చి రతని కండపడఁగ దొరలు. ౩౮

సీ. కదనరంగమునందుఁ గాలు ద్రిప్పని జోదు
పల్నాటి ప్రభువైన "పద్మనాయఁ"
డఁ వీరతతికి సింహస్వప్నమై పొల్చు
బలవంతులకుఁ బెద్ద "వల్లభన్న"
శత్రుసైన్యంబులఁ జప్పరింపఁగ జాలు
నాలరి యగు "కరియాలరాజు"
పగఱకుఁ బ్రక్కలో బల్లెమై యొప్పు ను
ద్దండుండు "నేతిముద్దయ్యనాయఁ"
గీ. డాదిగాఁగల బల్లిదు లాలమునకు
విందుగుడువంగఁ జనునట్టి వేడ్క ప్రబల
వాఁడితనమును మీసలవలనఁ గ్రిక్క
చప్పళించుచు వచ్చిరి హస్తములను. ౩౯

కం. ఆ యాదవులకు సేనా
నాయకులై బ్రహ్మరుద్రనాముఁడు విశ్రుం;
డాయత బాహువు పిన్నను
నాయందును వచ్చి యని మొనకా నిల్చి రటకా. ౪౦

గీ. ఉభయ సేనలుఁ బాలేటియొడ్డునందుఁ
బంచలింగాలగుట్టకుఁ బ్రక్కనున్న
పెద్దమైదానమునయందు విడిసి యందు
వీరపాణంబొనర్చు చున్నార లలసి. ౪౧

గీ. అత్తతిని ఖడ్గతిక్కన యాత్మసేన
కనియెఁ "బిచ్చుకపైని బ్రహ్మాస్త్రమట్లు
యాదవునిగెల్వ నింత సైన్యం బదేల ?
యుండుఁడిటఁ దీర్తుఁ బని నే నొకండపోయి." ౪౧

కం. అనుచుం గతిపయసైనికు
లను మాత్రముఁ గొని యెదిరి బలముపై కుఱికెన్
గని పిన్నమనాయండును
దనమొన నుసికొలిపి వానిఁదాఁకె మగఁటిమిన్. ౪౨

కం. కలియంబడెఁ గత్తులుఁ గ
త్తు, లీటెయలు నీటెయలును, దోడ్తోఁ గడిమిం
జెలరేఁగె సింహనాదం
బులతోఁ బటుసింహనాదములు పైకొనుచున్. ౪౩

కం. పులులుం బులులుం, గుంజర
ములుఁ గుంజరములును, సింగములునున్ సింగం
బులుఁ, గార్దన్నలు దున్నలు
బలె యోధు లొకళ్ళొకళ్ళపయిఁబడి రంతన్. ౪౪

మ. తలలన్ వ్రేఁదుచు, ఱెక్కలన్ విఱుచుచున్
దర్పంబునం గ్రుద్దుచున్
నలుగం జేయుచు, మట్టగించుచును, వెం
టంబాఱి ఖండించుచున్

బలిమిం జీల్చుచు వాఁడిగోళ్లఁ గొనలన్,
బల్లెంబులం గ్రుచ్చుచున్
గలనింజేయఁ దొడంగె నా యిరుమొనల్
గానెక్కు రౌద్రంబునన్. ౪౬

ఆ. వె. తాడిఁ దన్ను వానిఁ దలఁదన్ను వాఁ డుండు
నన్న చందమునఁ దదాహవమున
వానిమించి వీఁడు, వీని మించి మఱొకండు,
వీరి మించి తాఁకె వేఱొకండు. ౪౭

ఆ. వె. కత్తి మొక్కవఱచు కర్కశత్వముగల్గి
కండగొన్న వారి గాత్రకములు
వాఁడి అంపములను మొఱి డొనర్పఁగఁజాలు
రాతిదూలముల తెఱంగుఁదాల్చె. ౪౮

చ. వికటత విప్రవీరుఁడు ప
విం బురుడించెడు కత్తిఁదూసి యు
త్సుకుఁడయి దూఁకె, గట్టుకడఁ
జూచుచునుండిన యాదవాళి కొం
డకదలివచ్చుచున్నది హు
టాహుటిగా నని దోఁప జూచువా
రికిఁ బఱతెంచి పేర్చి పర
బృందముపైఁ బడె వెన్కపాటుగన్. ౪౯

గీ. ఖడ్గతిక్కన చేతిలోఁ గత్తియుండ
మనకుఁ బనియుండఁబోదని మదిని నమ్మి
మనుమసిద్ధిమహీపతి మొనలు త్రాగి
పరవశతఁగొంట రావ యీ ప్రాంతమునకు. ౫౦

చ. అఱనిముసంబులోపలనె
యాదవుసైన్యము మన్మసిద్ధి భూ
వరు భటసంతతిం గవియ
వారలొకొక్కరుఁ దీసిపోక పె
క్కురవలెఁ జీఱికింగొనక
కొండొకకాలము పోరి డస్సి యె
ల్లరు భువి మూర్ఛమున్గిరి బ
లంబఱి తిక్కన దక్క దుర్విధిన్. ౫౧

కం. పిఱుదివియఁ దలంపక యొం
టరియయ్యును ఖడ్గతిక్కన భుజాయుగమే
పరకంఠవల్లులకుఁ గ
త్తెరగాఁ జేయుచును దాఁకెఁ దెగువన్ వారిన్. ౫౨

కం. తమవారిఁ ద్రోసికొని పి
న్నమనాయఁడు వచ్చి ముందునకు, మాన్పించి యు
ద్ధము, నెదుట నిలిచి బత్తిని
నమస్కరించి రణతిక్కనకు నిట్లనియెన్. ౫౩

శా. "మీరల్ విప్రులఁ రేము శూద్రులము స్వా
మీ! మీ పవిత్రాంఘ్రులన్
నీరంధ్రంబగుభక్తిఁ గొల్తుముగదా!
నిత్యంబుఁ; జాలింపుఁడీ
పోరాటంబును; మాకుఁ జుట్టుకొనునే
మో! బ్రహ్మహత్యాఘము; మీ
వీరుల్ కొండలఁ బిండిగొట్టఁగను బృ
థ్వింజుట్టఁగా దిట్టరుల్. ౫౪

చ. అనవుడు ఖడ్గతిక్కఁడన
హాయుబలిష్ఠుఁడు గానఁ జీఱికిం
గొనకయుఁ దద్విభీషికల,
గుఱ్ఱ మరాతులపైకిఁ దోలి క
త్తిని విదిలించు చోఁదలలఁ
ద్రెంచుచుఁ గల్క్యవతారమట్లు తా
నని మొనఁ గొంతకాలము వి
హార మొనర్చెను విక్రమాఢ్యుఁడై ౫౫

ఆ. వె. అలసె మిగుల నొడలు కొలఁది సేఁపటిఁ; కంతఁ
జెమటవట్టి కత్తి చేయిజాఱెఁ;
బిగిదిలిపోని ధృతిని వదలఁ గళ్యము వారు
వంబు నూర్పుఁదొడఁగెఁ బగఱదండు ౫౬

కం. విడివడ గుఱ్ఱము గాడిద
వడువుం గొని కాలఁదన్ను; వసమఱి కఱచున్
ఒడలెల్లఁ బుండువాఱఁగఁ;
గడుఁ దోఁకను విసరి తల్లకిందుగాఁ బడవేయున్. ౫౭

ఆ. వె. వానియశ్వ మనినిఁ బ్రళయతాండవ మాడి
బడలిపోయి పిక్కబలము దఱుగఁ
బరులు తన్ను రౌతుఁ బరిభవింత్రని యేమొ?
తనదు విడిఁది కేఁగఁ దలఁచె మదిని. ౫౮

కం. తురగం బాతనిఁ గైకొని
పఱచెం బురమునకు; నొడలు స్వస్థతలేమిన్
మరలింపమానెఁ దమదగు
పరివారము నిలిచియున్న వంకకు దానిన్. ౫౯

గీ. ఒడలు సరిలేమి వచ్చిన నోటువడియె
వచ్చెననుకొండ్రు లోకులు పరిహసింత్రు
నని తలంపక రణతిక్కఁ డరుగుదెంచె
స్వాస్థ్యమునుబొంది మరలఁబోవచ్చు ననుచు. ౬౦

కం. బలమఱినఁ జచ్చిపోవక
పొలికలనన్, "స్వగృహమునకుఁబోఁదలఁచుట శూ
రుల కనుచిత మగు" ననియెడి
తెలివింగొనఁ డతఁడు హయము దిరిగెడు నదనన్. ౬౧

ఉ. ఆతఁడు వచ్చుచుండఁగ గృ
హాభిముఖుండయి త్రోవఁ జేర సం
ఘాతము వానివ్రాలిన మొ
గంబును, గెల్పుపతాకలేని డా
చేతినిఁ, గత్తిలేని వలచేతినిఁ
గాంచియు నవ్వసాఁగె; స్త్రీ
వ్రాతము మూతిఁ ద్రిప్పి విఱు
వందొడఁగెన్ నెటికల్ కడుంగడున్. ౬౨

చ. ప్రమద మెలర్ప నత్తఱిని
బాటకుఁ బ్రిక్కనె బాలకుల్ సుహృ
త్సమర మొనర్చుచుండి; రొక
శాబకుఁ డోడి శిరస్సు వాంచి గే
హమునకుఁ బోవుచుండ నధ
మాధముఁ డాఁడుదికన్న యుద్ధరం
గమువిడి పాఱువాఁడని న
గంగఁ దొడంగిరి గేలిసేయుచున్. ౬౩

ఆ. వె. ఖడ్గతిక్కఁ డోటుగని వట్టితిక్కఁడై
పాఱివచ్చె నంచుఁ బ్రజలఁ బ్రాఁకి
యతనికన్న మున్న యరుదెంచె దుర్వార్త
యిస్సిరో ? యనంగ నింటివారు. ౬౪

కం. తురగంబు డిగ్గి లోనికి
నరుదెంచిన పతినిఁగాంచి యతని యువతి తాఁ
బరికించియుఁ బరికింపని
సరణిని నెమ్మొగము మలఁచి చరచర నరిగెన్. ౬౫

క. శతవృద్ధాతని జనకుఁడు
ధృతరాష్ట్రుఁడు కూరుచుండి తిన్నె పయినిఁ ద
త్సుతు సేమముఁ బ్రశ్నింపఁడు
కుతుకముఁ గొనఁ డతని రాకకును లేశంబున్. ౬౬

ఆ. వె. శిష్యుఁడొకఁడు వానిచెంతఁ బాఠంబును
వల్లెవేయువాఁడు పాడె నిట్లు
"మగతనంబులేని మగవాని కన్నను
బేఁడివాఁడ మేలివాఁడు సుమ్మ! ౬౭

కం. మరణం బవశ్యమేకద!
ధరఁగీరితి మలిన పఱపఁదగునే జంతూ
త్కరమునకు వృథగ?; నరయఁగ
మరణం బపయశము కన్న మాన్యముగాదే!'' ౬౮

కం. ఎఱిఁగియును దల్లి యాతని
యరుదెంచినవార్త నెఱుఁగనట్టులు లోనం
దిరుగుచు నుండెనుగానీ
యరుదెంచితె? తిక్క! నాయనా! యన దయ్యెన్. ౬౯

కం. తన వార్వమునకు దాణాఁ
దినిపింపఁగ, నీరు వట్టుఁ దీర్పఁగ, మరియున్
దన దుస్తులందు కొనఁగను
గనిపింపఁడయ్యె బంటొకండేని నటన్. ౨౦

కం. తన ముద్దుపట్టిపిలిచినఁ
దనవంకకు రాక నరిగె దాదాల; కిటుల్
తన సర్వస్వముఁ బూనెను
దనతో సత్యాగ్రహంబుఁ దగఁగావింపన్. ౨౧

ఉ. ఆతఁడు చాఁపనుం బఱచి
యంగము వ్రాలిచి త్రోవఁ బౌరసం
ఘాత మొనర్చు నవ్వు తొలి
గా నిదిదాఁక ఘటిల్లు నీ పరా
భూతిపరంపరం గుఱించి
మోము ముడించి స్వకీయదోషపుం
జేఁతఫలంబుగా నెఱిఁగి
చింతిలుచుండె నెడంద నొంటిగా. ౨౨

గీ. అత్తఱిని "లేవవచ్చు నిల్లాడ" నంచు
వాని కశరీరవాణి నా వీనులఁబడె
నాతఁ డింటికిఁ గ్రొత్తవాఁడైనయట్లు
ఎదుటఁ జననియు భార్యయు నొదిగిపోయె ౨౩

కం॥ కానిమ్మని రణతిక్కన
స్నానార్థము లేచి పెరటిచాయకుఁ జనియెన్
మానంబుకన్న నతనికిఁ
బ్రాణంబే తీఁపి యయ్యె నక్కాలమునన్ ౭౪

కం॥ కనిపించె స్నానదేశం
బున నిలిపిన నులకమంచమును, దానికిఁ జా
టున నొక్క నీళ్ళబిందియ
యును, దానం బసుపుముద్దయును దిక్కనికిన్. ౭౫

కం॥ తిక్కం డాతఁడు మొదలనె!
తిక్కెక్కఁగ దానిఁ గాంచి దిగమ్రింగి యెటో!
పక్కఁగల పడఁతిఁ గనుఁగొని
యిక్కత యే? మనుడు నాపె యిట్లని దులిపెన్. ౭౬

* కం॥ "పగఱకు వెన్నిచ్చినచో
నగరే నిను మగతనంపు నాయకులెందున్?
ముగురాడువారమైతిమి
వగపేటికి జలకమాడ వచ్చినచోటన్. ౭౭

కం॥ పురుషుఁడ వని మా తండిరి
పోరపడి నన్నొసఁగె నీకుఁ; బోరిఁ బౌరుషముం
బరులపయిఁ జూపినప్పుడె
పురుషుం డగు; వట్టి రూపమునఁ బురుషుండే?" ౭౮

కం. అని వీరావేశంబునఁ
దన నాథుని నీసడించి తెగవటి తా న
ట్లనవలసివచ్చినందుల
కనయముఁ జింతిలుచుఁ బాసి యచటాపె చనెన్. ౭౯

ఆ. వె. పసుపుకుంకుములకు వలెనె తేజమునకు
హాని సైఁప దెపుడు మానిని మది;
కత్తిఁ జేతి కిచ్చి కదనస్థలికిఁ బంపి
పతి గతింపఁ దోన చితి గమించు. ౮౦

గీ. పచ్చిపుండయి నొగిలించువాని యెడఁద
గుండు గ్రుచ్చిన యట్లయ్యెఁ; గొంతతడవు
సైఁపలేకయు నెట్లెట్లొ సైచి వ్యథను
బలుక కింకెట్టి మాటపైఁబడునో? యనుచు. ౮౧

కం. తల తిరుగుచుండఁ, జిత్తము
గళవళపడఁ, దొట్రుపాటు గదురఁగ నడలన్
అలమఁగఁ గన్నులఁ జీఁకటి
మెలమెల వంటింటి పీఁటమీఁదికి నరిగెన్. ౮౨

కం. మడిదోవతి ప్రీతిగాఁదన
పడఁతుక ధరియించుకోకఁ బరికించి యటన్
గడఁద్రోచి యెడమకాలను
నుదుకుచుఁ దడివల్వఁ గూరుచుండె భుజింపన్. ౮౩

గీ. పాఱఁబోఁత్రైన పుత్త్రుని పార్శ్వమందుఁ
దాఁ భుజించుట పెద్దపాతక మటంచుఁ
దలచి రాఁడయ్యెఁ బంక్తికిఁ దండ్రి యలిగి
యడుగఁ డయ్యెను దిక్కండు నతనిఁ గూర్చి. ౫౪

గీ. తల్లి వడ్డించు మౌనవ్రతంబుతోన
తలను వాంచియు కూర్చుండెఁ బలుక కతఁడు
వలయునది కేల వలదను; వలవనట్టి
దాని వడ్డించుకొనుఁ ద్రోయు దాల కెఱిఁగి. ౫౫

మ. తినఁగా నన్నముఁ గూరలుం గలిపి మ
ర్దించున్; ప్రమాణాధికం
బునుగా ముద్దలు సేయు; వానిఁ జిదుమం
బూనున్; భుజింపంగఁ జే
తిని దానెత్తును నోటిదాఁక; మఱలం
దీయంగ నుంకించు; నా
యన యిట్టుల్ మతిమాలి పేరనకె
యాహారంబు నంజెం దగన్. ౫౬

కం. ఉదరాగ్ని యడఁగ నాతని
హృదయాగ్నిని నేమి నోటి కింపుగ నుండున్?
మెదుకులు నాల్గివ్విధమునఁ
గదుకుచు వడ్డించెఁ దల్లి కడకుం బాలన్. ౫౭

కం. మునుపటివలెఁగా కవి తన
మనస్సువలె విఱిగియుండ మల్లడిగొని తి
క్కన యనె "నేఁ డేమమ్మా!
మన యీ పాల్విఱిగె?" ననుడు మాత వచించెన్. ౫౮

* కం. "అసదృశముగ నరివీరులఁ
బసమీఱఁగ గెలువలేక పందక్రియన్ నీ
వసివైచి పాఱివచ్చినఁ
బసులున్ విఱిగినవి; తిక్క! పాలున్ విఱిగెన్. ౫౯

కం. మగనాండ్రిందఱు నన్నున్
"మగవాఁ డుదయించె వీరమాత" వటంచుం
బొగడి రది రిత్తయయ్యెను
బొగులుదు" గొడ్రాలిఁ గాకపోతి నటంచున్. ౬౦

కం. అనుచున్ సోల్లుంఠనముగఁ
దన తల్లి వచింప నతఁడు దన నెమ్మెయి వాఁ
తను వేసినట్లు, హృదయం
బున శల్యము నాఁటినట్లుఁ బొగిలె న్నొగిలెన్. ౬౧

కం. మనసుచెడి యుత్తరాపో
శనమును బొనరించి లేచి చయ్యన నింటం
దనకు ఘటిల్లిన సమ్మా
ననఁగూర్చి ఖడ్గతిక్కన దలంచె నిటుల్. ౬౨

మ. ననువీ రెల్లరుఁ బాఱుఁబోఁ తనని యి
న్నాళ్లే సమార్జించియుం
డిన కీర్తిం గయికోక యిట్టు లవమా
నింపన్ మొదల్ వెట్టి; రు
ర్వ్యా నిసీ! గుమ్మడికాయయంత గుణముం
బేర్కొక యావంతయుం
డిన దోషంబుఁ దలంత్రు పెద్దగ జనుల్
డెందంబునం గ్రూరులై. ౯౩

ఉ. నేనయి పాఱివచ్చితినె?
నిల్చియు నొంటరిగా నలంగ నా
మే, నసిజాలుఁ గేల,ఁ గడి
మిం దురగంబును ద్రోలి శత్రుసం
తానము నుగ్గునూఁచగ నో
నర్చితిఁ ద్రొక్కఁగఁ జేసి; డస్సితిన్;
గాని తుదిన్ హయంబు ననుఁ
గైకొనివచ్చె; నెవం డెఱింగెడిన్ ? ౯౪

కం. కొని తేరకున్నఁ దురగము
నను నాపాలికలని నుండి నా కీరితి భూ
మిని నాచంద్రార్కముగాఁ
దనరెడి దకళంకముగ నితాంతోజ్జ్వలమై. ౯౫

ఉ. నమ్మరు; నమ్మఁజేయుటకు
నాకిట సాక్ష్యములేదు; కాన దో
షమ్మును సమ్మతించి యయ
శమ్మును బాఁపుకొనంగ యుక్త య
త్నమ్మొనరింతు; నాదుతలి
దండ్రులు భార్యయు నిట్లు నావ్రతా
పమ్మున కేవగింపఁ బెఱ
వారల సంగతిఁ జెప్పనేటికిన్! ౯౬

కం. బలమఱినఁ జచ్చిపోవక
పొలికలనను స్వగృహమునకుఁ బోఁదలఁచుట వీ
రుల కనుచితమగు! "నాకీ
వెలివేటికి లేదొ? హయము దిరిగెడు నదనన్. ౯౭

ఉ. నోరను నాల్కలేనిది; న
న్నన్ భగవంతునిఁగాఁ దలంచుచున్
ద్వారతలంబునన్ నిలిచి
వచ్చు జనుం గని నిండుబత్తితో
హారతి నిచ్చుచుండు ప్రియు
రాలు తలంకక యీసడించి నన్
జేటికినైనఁ గైకొనక
స్త్రీవనుచుం దెగడెం గడుంగడున్. ౯౮

మ. నను యుద్ధాగతు, రక్తసిక్తతను, వి
న్నాణంబుగా శైశవం
బునఁ గ్రీడాక్షతగాత్రునిం బలెనె దాఁ
పుంజేరి నెత్రద్దు; మం
దును రాయున్; మెలమెల్లఁ బట్టుమెయిఁ గే
ల్దోయిన్; భుజింపించు; ని
ద్రను బుచ్చుందొలి; నేఁడు నా జనని నన్
అంపంబునం గోసెఁబో! ౯౯

గీ. శిరసుపైఁ జేయివైచి స్పృశించు చెపుడు
సమరకేళికళారహస్యములఁ గఱపు
తాతపాదుల మూకవ్రతంబు నన్నుఁ
గాఱుచిచ్చునఁ బడఁద్రొబ్బి కాల్చుచుండె. ౧౦౦

గీ. వీరరక్తంబు వీరిశరీరమందుఁ
బ్రత్యణువునుండి చిందుచుఁ బైకిఁ బఱచు
ముదిసినను జేవగొనె వీరహృదయము; లిలఁ
జెప్పుదురుగాదె? ముదిమ్రాఁకు చేవయంచు. ౧౦౧

శా. నాయందుంగల కూర్మిచేతన సుమీ!
నా బాంధవుల్ మిత్రముల్
నాయీ వీర్యకళంకమున్ సయిపకు
న్నా; రట్టులన్నా; రిలన్

శ్రేయస్కాములె తప్పుపట్టుదురు గా
నీ శత్రులే మెత్త్రు; నేఁ
బ్రాయశ్చిత్తము సేసికోవలె విశం
బంబేల యీ చేఁతకున్? ౧౦౨

కం. అని తలఁచి వీరపాణిం
బునవలెఁ దత్క్షత్రియుల వీర్యము విజృంభింపన్
ఇనుమడి మున్మడియై, తి
క్కన నిలువఁగఁ జాల కనికిఁ గ్రక్కున నుఱికెన్. ౧౦౩ ✓

శా. ఆకాశంబును మ్రింగునో? పెఱుకునో
యా మేరుశైలంబు; న
క్షత్రాఁకల్ పొందఁగ మూఁడుకోట్ల సురలు;
సప్తాంభోధులం ద్రచ్చునో?
వీఁకన్ లోకముఁ బిండలించి యెగురన్
వేయంగ భావించెనో?
భూకంపంబు ఘటించునో? యని జనంబుల్
పొంది రెంతే వెఱన్. ౧౦౪

గీ. అట్లు సని విప్రవీరుఁ డాయరులసేన
పైని జిచ్చుఱపిడుగు చందానఁ బడెను;
గాఁడు దిక్కుం డితండు భార్గవుఁడె వచ్చెఁ
బఱపాతఁబుమై సని వారు దలఁక. ౧౦౫

గీ. పదియు నాలుగులోకముల్ భస్మరాశి
సలుపు కౌశికు దివ్యాస్త్రసంచయంబు
పెంపడఁగి మోఁకటిల్లె నిర్వీర్యమగుచు
బ్రాహ్మ్యతేజంబు నెవ్వాఁడు ప్రతిఘటించు ? ౧౦౬

కం. పేలం గ్రుక్కినగతి, నఱి
కాలన్ నల్లులను రాయుకరణిని, గాయల్
చీలిచినరీతి, శాత్రవ
జాలము నాతండొనర్చె సంహారంబున్. ౧౦౭

* చ. పదటున వాజి రాహుతుల
పై దుమికించుచుఁ దిక్కుఁదార్చిసన్
బెదరి భ్రమించి భీతివడి
పెల్లుగఁ జూడ్కులు సంచలింపఁగా
నదె! యిదె! వాజి; వాల్మెఱుఁగు
లల్లవె! యాతఁడె తిక్కఁడంచనన్
గొడుకక యాజిసేసె రిపు
కోటుల కందఱి కన్నిరూపులై. ౧౦౮

కం. విఱిగిన కాళులఁ, బగిలిన
శిరములఁ, దెగిపడినయట్టి చేతుల బహుధా
తరిగిన యొడళ్ల నా సం
గరభువి నూనాంగణంబు కరణిం బొలిచెన్. ౧౦౯

గీ. పదునొకండ్రైన రుద్రులు వచ్చి విప్పి
నిప్పుకంటి నటింపఁ బూసిరో యనంగ
రక్తనదులఁ బిపాసఁ దీర్పంగ మృత్యు
దేవతయు వచ్చెననఁగఁ దద్దేశ మొప్పె. ౧౧౦

కం. క్రమముగఁ బీనుఁగుఁబెంటై
సమరస్థలి కానిపింప సరదారగు పి
న్నమనాయఁడు గుండెలు చెడి
ప్రమాద మగు ననుచు వెనుకప్రక్కకు జరిగెన్. ౧౧౧

గీ. జరిగి "పాకంబు ముదిరె నీ సారి కాన
నెట్లు వచ్చెట్లు పోవునో! యెఱుఁగరాము
దేనికైనను మేలని తిక్కనికిని
బ్రహ్మరుద్రయ్య నుజ్జిగాఁ బంపె నతఁడు ౧౧౨

కం. వాదికి సముచితుఁడగు ప్రతి
వాదియు, వీరునకుఁ దగిన ప్రతివీరుండుం,
దా దొరకిన నోడ లెదుగఁగ
మీఁదికిఁ బరవశత దూఁకి మ్రింగఁ దలచుఁగా! ౧౧౩

శా. కొండల్ డీకొనినట్లు విక్రమమునన్
గ్రోధించి కర్ణార్జునుల్
దండాదండిగ మారుకొన్న కరణిన్
దర్పించి దివ్యాస్త్రముల్

రెం డొండొర్వ్యలఁదాఁకు చందమున
బలిస్త్రం బేర్చి యా బ్రహ్మరు
ద్రుండుం దిక్కనయు న్నెదుర్కొనిరి సం
స్తుత్యంబుగా నత్తఱిన్. ౧౧౪

కం. సందీక కత్తివ్రేట్లకు,
నందక బల్లెంపుపోట్ల, కళ్యాంబుల మిం
చుం దీవ లట్లు పఱపు చ
మందోత్సాహమున వారు మసలిరి కలన౯. ౧౧౫

కం. ఇరువురును గొదమసింగము;
లిరువురును గాఱుచిచ్చు; లిరువురును యువల్;
సరు; లన్యోన్యజిగీషా
పరు; లెట్లొనఁగూడు జయము ప్రత్యేకమున౯? ౧౧౬

కం. చివరికి వారిరువురు వా
రువములపై విసరి రొండొరుల ఖడ్గంబుల్;
తవులఁగ నెఱఁకుల నయ్యవి
భువిఁ బడెఁ దమ రౌతుకొలువు పోక కొఱలుచు౯. ౧౧౭

శా. అంత౯ వారలు దూఁకి క్రిందికి స్వ
వీర్యం బెల్లఁ గుంచించి బా
హాంత ప్రోద్యత శాతఖడ్గముల యం
దర్పించి దర్పించి య

త్యంతం బేకముహూర్త మందె విసరన్
దద్ఘాతలన్ శీర్షముల్
బంతుల్ వోలెను రెండుఁబై కెగసి నే
లన్ వ్రాలెఁ బార్శ్వంబులన్. ౧౧౮

కం. తలిదండ్రులును గళత్రం
బల తిక్కని వీరమరణ మాలింపంగా
వలకంట హర్షబాష్పం
బులు నురలె విషాదబాష్పములు డాకంటన్. ౧౧౯

కం. సమరోత్సాహియుఁ, బతినిన్
సమరమునకుఁ బ్రోత్సహించు సతియును, సుతు ప్రా
ణములకు వెఱవని సద్వీ
రమాతయును నాంధ్రభూమిఁ బ్రభవింత్రె యిఁకన్ ?

సీ. నందినిఁ బుత్తెంచె నిందు శేఖరుఁడు నీ
వన్న ! యేతెమ్ము తారాద్రి కడకు
గరుడినిఁ బుత్తెంచె నరహారి రావయ్య !
గుణసిద్ధ తిక్క ! వైకుంఠమునకు
హంసను బుత్తెంచె నజుఁడు నీకడకు ను
భయకుల మిత్ర ! రా ! బ్రహ్మకడకు
నైరావతముఁ బంపె నమరేంద్రుఁ డిప్పుడు
దినమున కేతెమ్ము ! తిక్కయోధ !

ఆ. వె. అనుచు వేఱువేఱ నర్థితోఁ బిలువంగ
వారు వీరు గూడ వచ్చివచ్చి
దివ్యయోగియైన తిక్కనామాత్యుండు
సూర్యమండలంబుఁ జొచ్చిపోయె. ౧౨౧

# శుద్ధపత్రము.

| పుట | పంక్తి | అసాధువు | సాధువు |
|---|---|---|---|
| 26 | 20 | గడుకుచు | గడుకుడు |
| 28 | 1 | బాఱుఁబోఁతననియి | బాఱుఁబోఁతనుచుని |